మనోహరహస్తము నెత్తుకొని ముద్దాడెను. ఖలీలుఁ డిట్టులనెను —

"కాని, పట్టుపడిన, నపాయకరముగదా! ఘోరమగు శిక్షకుఁ బాల్పడవలయునే?"

నిజమనోహర నీలనయనములం దన ప్రియునిపై నిల్పి ఆస్త్రైణి యిట్టులనెను —

"అపాయమేమియు లేదు. సుందరాంగా! ఆశీశలల తోమందిరమున నిన్నటిరేయి నీవు వినిపించిన హెలీనా జిజీముల చిత్రకథ ముగిసిన యనంతరము వచ్చిన సంభాషణ మఱచితివా?"

"మఱవలేదు — కాని, పూర్తిగ జ్ఞప్తికి రాకున్నది. స్వప్నగత విషయమువలెఁ గొంతకొంత యస్పష్టముగ మనంబునఁ దోఁచుచున్నది."

ప్రభుపత్ని వదనమున నాగ్రహాతురములు తోఁచెను. తానా ప్రసంగము దెచ్చినంతనే తనప్రియుఁడు గ్రహించి తోడ్పడునని ఆమె ఆసించెను. అటుగాక ఖలీలుఁను వేఱువిధమున నుండుటచే, దానొన రింపఁదలంచిన దుష్కార్యము సమగ్రముగ వక్కాణింపవలసి వచ్చెను. —

"సుందరాంగా! మఱచితివా నీ మిత్రుడు లూకాసు చేసిన విషాభివర్ణనము? పోపు వంశజులును రష్యారాజవంశజులును ఆవిషము నిరంతరము ప్రయోగించుచుండిరట —"

"ఆ! తెలిసినది. ఆపాషాణవిషౌషధము గుఱించియా? ఆ విషయమున నాకు మఱికొంచెము తెలియును. కాని, నీకును తక్కుంగల కోమలాంగులకును దుస్సహంబని ఎంచి చెప్పకుంటిని."

"తెలియునా? ఏమి తెలియునో రయమ్మునఁ దెలుపుము."

"అనేక విద్యలతోఁబాటు రసాయనశాస్త్రము గూడ నాకుఁ గడుపరిచితము. నేను సంకల్పింతునేని, అట్టివిషము సులభముగాఁ దయారుచేయఁగలను."

ఆపలుకులు వీనులఁబడి నంతనే ప్రభుపత్ని సుందరవదన మూకస్మి

కముగ భయానక రాక్షసానంద దీక్షితయాయెను — "ఏమంటివి! నీకట్టి సామర్థ్యముగలదుగా?"

"మిథ్యా ప్రగల్భములు నాకసహ్యము. సుందరీ! ఈ వికసిత పుష్పచయంబులు జూడుము. మాటలకెంతయు సుందరములు, నవ్య సుగంధబంధురములు, నవసితకోమలములు. కాని, విషౌషధ రచనకు వలయు పదార్థము లీసుమప్రాతములకేగాక ప్రతిదానియందు నడంగి యుండు: పీనియందేగాక, ఇసుకయందు, రాలయందు, మఱియే యితర వస్తువు నందును గూడ నిమిడియుండు—"

"కాని, లూకాసు చెప్పిన పాషాణము!"

"కాంతా! తళతళ మెరయు నీశిలాఖండములు జూడుము —

ఇవియు విషపదార్థ సంభరితములని గ్రహింపుము. విశేషపరికర సాహాయ్యమావంతయు నపేక్షింపక మదీయపరిశోధనాగారమునం దుండి అసలాంబువుల సాయము మాత్రము వడసి ఆమోఘ విష మొండు తయారుచేయఁగలను—"

"చాలు చాలు! ధన్యురాలను! నేఁడు నిక్కముగ సుదినము! ఆవిసమెద్దిరో యా సత్వర మొసంగుము నీకొఱకద్దాని ప్రయోగింతును!"

"దానఁగలుగు నపాయము?"

"నే నాబాధ్యతవహింతు. ఆ విషము మెసవువాఁడు కొన్ని వారములు రోగార్తుఁడై క్రమముగాఁ గృశించి కృశియించి రోగనైజ మెఱుంగక యే, తాను రోగగ్రస్తుఁడనైతినని అరయఁజాలక నే చచ్చు నని లూకాసు తెలిపెగదా. కాన, మనము తీవ్రపడక అట్టులే యొన రింతము. కార్య మా తెఱంగున నిరపాయముగాఁ జక్కఁబడును. కాని, నీమాట స్పష్టము కావలయు — నీకు సమ్మతమని ఒక్కింత సూచింపుము, చాలును — ఎట్టి యకార్యమైన నొనరించి చిరతరా నంద సంపాదన మొనరింపఁ బ్రయత్నింతును. అసహ్యాకరమగు పతి

ప్రేమాభిజ్ఞ దాస్యపంకపరిత్యక్తనై, నీకు మదీయ హృదయార్పణ మొనరించి నీదాననై యుందు ఖలీల్ ! నీవు ధనవంతుడవు కావచ్చును; ఐనను, నాకతంబున నధికతర కాంతి విత్తవంతుడవై రాజ భోగము లనుభవింపఁగలవు. సుందరాంగా ! ఏమందువు ? ఒక్కమాటాడుము."

ఖలీలుఁడు సమ్మతించి, తా నాకాంతకుఁ జూపిన తాలను భద్రముగ జేబునం దుంచి ఇట్లు నెను — "సర్వసౌఖ్య ప్రదమగు సాధన మిప్పుడు నాయధీనమైయున్నది. కాని, సుందరీ ! నిన్ను మగుడ గాంచు టెట్లు ? రెండు రాత్రులును — "

"సుందరాంగా ! రెండు రాత్రులును నీవు భగ్నమనోరథుఁడవై తివి — నామనోవ్యథ మఱియు నధికతరము. కానిమ్ము — చతుర మతియగు అమీనా సాహాయ్యమున మన మెట్టులో కలియఁగలము. కాని, ఈలోపున మందు సిద్ధమగునా ? "

"సిద్ధము కాఁగలదు. కాని — ఆహా ! మనమిందరు దెంచి ఎంత కాలమాయెను ! చాల కాలమగుటచే పాషా వెదకు లాడుచు నిటు రానగును. మన మొక వంకను, తమ ప్రియులతోఁ బాటు పుత్రిక లొక వంకను గాన్పింతుమేని — "

ఖలీలుఁడు వాక్యము పూరింపకమున్నె గుల్నేరు లూకాసులుదవ్వున గోచరించిరి. ఆకారణమున, ఖలీలుఁడు ప్రభుపత్ని భుజవలయమునుండి రయంబున వెలువడెను. — "తరుణీ ! మనము జాగరూకులమైయుండ వలయు. ఆయువజను లనుమానించుట కవకాశమీయక, కేవల నిశ్చల స్నేహ పూర్వకముగా విహరించునట్లు తోఁపవలయు."

అంతలో లూకాసు గుల్నేరులును, జైరజా జూలియనులును వారినిఁ గలిసికొనిరి. జులేఖా పాషాలను వీడి చాలకాల మగుటచే నిఁకఁ దిరిగి పోవుట పాడియగునని ఖాలీలుఁడు పలికెను. తోడనే కాంతలు నిజకూలాచారాను గుణముగ ముసుఁగుల నుచితముగఁ

దాల్చి, తమ కోమల పాదహస్తములు మెల్లమెల్లన ధరాతలమును జుంబింప నడిచిరి. కొంత దవ్వున యమభటులు వారి ననుగమించిరి.

శీతల లతాగృహంబున నతల్పమున పాపా గుఱుగుఱు ధ్వని నొనరించుచు మేను మఱచి నిద్రాసౌఖ్యము బూర్తిగఁ జూరగొనుచుండెను. ప్రభువు నిద్రాపరుండై సంతసనే చేదప్పిన ధూమనాళము క్రిందపడియుండెను. ఆప్రక్కనే యుండవలసిన జులేఖా మాత్రము గానరాకుండెను !

## ౨౫

## జులేఖాయుదంతము

మామచెంగట నాసీనయైన జులేఖా ఏమి కావలయును ? నూరు గజము లలో నున్న నౌకయందు దామె యుండవలయునని సహజముగ యోచించి, గాఢనిద్రాధీనుఁడైన పాపాను మేల్కొల్పకయే ఖాలీ లాదు లటుబోయిరి. జులేఖాను గాంచి, ఆ మహమ్మదీయప్రభువు పరుండి ఎంత కాలమాయెనో అరయకుండ నిద్రాభంగ మొనరింప రాదని వా రాలోచించిరి. నౌక స్పష్టగోచర మాయెను; తచ్ఛోదకులు భయసంభ్రమాకులురై అప్రయత్నముగ దండములు బెట్టిరి; జులేఖా మాత్రము కానరాకుండెను.

ఖాలీలాదులు వడివడి ప్రశ్నింప, జులేఖా యిటు రాలేదనియు, నామె జాడ తా మెఱుంగమనియు వానిసలు ప్రత్యుత్తర మొసం గిరి. గుల్నేరు భీతచేతస్కయై జులేఖాకు నేదియో యపాయము వా టిల్లెనని యఱచెను. తత్క్షణము దాము వెదకవలయునని ఖైరజా యనెను. "పాపా గాఢనిద్రాపరుండగుట గాంచి అటులందే యుం డుట సహింపక, ఇంచెందో విహరించుచుండును; ఈ సరి కరుదెంచి యుండును. రండు." అని ఇస్మిల్లా వాక్రుచ్చెను.

తోడనే వారందఱు మగిడి పాషా శయనించిన తావునకుఁ బోయిరి. అతఁ డప్పుడే ప్రబోధితుఁ డగుచుండెను. మేను మఱచి, జగము మఱచి, మృతప్రాయుఁడై పడియుండిన ఆ మహనీయుఁడు మాత్రము జులేఖా ఏమాయెనో ఏమైయుండును? ఖాలీలాదులు వెడలిన యనంతరము పాషా మాటపాటించి జులేఖా యపూర్వ మధురకల స్వనమున గానమొనరించెను. మ్రోడులు చిగిరించెను: శిలలు ద్రవించెను; పాషా మేనుమఱచి శయనించెను. అనంతరమేమాయెనో ఆమహనీయుఁ డేమియు నెఱుంగఁడు. ఖాలీలుఁ డిట్లనెను. — "మన మూరక కాలహరణ మొనరింపక నలువంకల వెదుకవలయు. అలసిన అయ్యబలామణి బుద్ధిపూర్వకముగా నీ స్థలము వీడియుండదు. ఎద్దియేని అపాయము సంభవమై యుండు."

ఇస్మైడ్లా మానసము తోడనే ఈసున భగ్గుమనెను. — "జులేఖా అచిర కాలమున నరుదేఱ గలదు. మీ రనవసరాందోళనము వీడియుండుడు."

ప్రభుపత్ని హృదయావస్థ గుర్తించిన ఖలీలుఁడు తమ హృదయారాటము నడంచి గాంభీర్యము వహించి యుండవలయునని ఆమె శ్రవణమున నల్లనఁ బలికి, తన మిత్రుల నుద్దేశించి తాము తక్షణ మన్వేషణార్థము వెడలవలయునని హెచ్చరించెను. తోడనే ఆ యువకులు మువ్వురును మూఁడుమార్గములందు నమ్ములవలెఁ బాఱిరి.

జులేఖా విషయమింక నరయఁ బ్రయత్నింతము. దత్తనుపాషా నిద్రాధీనుఁడైన పిమ్మట జులేఖా గానము నిలిపి, నిజమనఃప్రభవాలోచనానిర్మగ్న ఆయెను. అంత యాకస్మికముగ, నాచుట్టు దట్టముగ బెఱిగియున్న సాంద్రతరగుల్మలతా నివహముల నలుకుడి యైనటులాయెను. జులేఖా ప్రకంపించి, చుట్టుం బరికించి, ఏమియుఁ గానక మఱల నాలోచనాధీనమానస ఆయెను. ఆసవ్వడి మగుడ వెలువడుటచే నాలతాంగి కుతూహలంబున దిగ్గున లేచి అవ్వల కేగి, చూడఁ

బోయెను. తోడనే, ఆకోమలి దుష్టవిష్ణురకరపీడిత ఆయెను: ఆ దురాత్ముని రెండవచేయి ఆసుకుమారహేమగాత్రి సుందర లాక్షార సారుణితాధరోష్ఠములను బంధించుటచే, నాహతభాగ్య కెవ్వన నఱచుటకునైన నవకాశము లేకపోయెను. తదవసర భయాతిరేక మున నామె తక్షణము మూర్ఛిల్లెను.

దాది బిడ్డ నెత్తుచందమున నాక్రూరుఁడు జులేఖాను దాల్చి, ఆశ్రమమున వాయుసమానజవమునఁ బరుగిడఁ జొచ్చెను. ఆపథం బున కిరుదెసల వృక్షములు గుబ్బుగఁ బెరిగియుండుటచే నావికులుగాని మఱి యెవ్వరుగాని వానినిఁ జూడరైరి. వాఁడా తెఱంగున నావిశా లారామము నిరపాయముగాఁ గడచి, మఱియొక వృక్షసంకీర్ణోపవనము జొచ్చిన యనంతరము జులేఖా కనువిచ్చి పరికించెను — నీలజీమూత సన్నిభదృఢగాత్రుని వికారాకారము భయంకరముగ గాన్పించెను!

జులేఖా తెలివొందెనని తెలిసినంతనే, ఆరక్కసుఁ డామెను మరకత ప్రభలతో నొప్పు పచ్చికపై దింపెను. వాని యభిప్రాయమేమి? ఏమియోగాని, ఆఘోరాకారుని ప్రవర్తనము విపరీతముగ నుండెను. మేఘనిర్ముక్తసుధాకరబింబమువలె మసుగుదొలఁగిన ఆసాగసు లాడి యపూర్వ సుందరాననమును, సువ్యక్తముగఁ దోఁచు నితర వివిధమనోహరాంగకములను గూడ తెప్పపాటు మఱచి అపూర్వా తురమునఁ దిలకింపుచు వాఁడానందింపఁ జొచ్చెను. జులేఖా భయ విహ్వల ఆయెను. అంత నాకాంత యొకింత ధైర్యము దాల్చి, లేచిఁ మోకరించి, ముకుళితహస్తయై మూర్తీభవించిన దీనత్వమువలె దోఁచెను. ఆశఠుఁడు తాల్చిన శ్వేతవస్త్రములు జలార్ద్రములగుటయే గాక, పంకనిలయములు గూడనై యుండుటచే, వాఁడు కొలఁదికాలము క్రిందటనే జలమున మునిఁగియుండుననని వ్యక్తమగుచుండెను. వాఁడు మన చిరపరిచితుడగు సిద్దీ మస్రూరయే అని పాఠకులు గ్రహించియే

యుందురు. జులేఖా మాత్రము వానిని గనివిని యెఱుంగదు. కాన నామె వినమ్రయై భయప్రకంపితయై యిట్లు ప్రశ్నించెను — “నీవెవ్వఁడవు? ఇట్టు లాచరింపఁ గతంబెట్టి?

నేనా? — నన్ను మగ్రూరాయుని పిలుతురు. ఇంతకాలము నీ మామ యగు దల్తబనుపాషా బానిసీఁడనై యుంటిని.”

“బానిసీఁటవా?” — భయసమ్రమ సంభ్రమభావములు తోడనే యంతరింప, నామానిని దిగ్గునలేచి, క్రోధవివశయై, మగుడ నిట్లు ప్రశ్నించెను — “బానిసీఁడవై యుంటివా? ఐన, నిపుడు పాఱివచ్చితివా?”

“నిజము. దల్తబను పాషా సేవనుండి తొలంగుటయే గాదు, ప్రాణము నిల్పుటయే దుర్ఘటము. పట్టువడినచో మరణము తప్పదు గాన, నిలిచిన తావున నిలువనేరక, ఇందందుఁ బరుగులాడుచుంటిని. కాని, సుందరీ! వాని పని పట్టింతును — నామోహము తీఱుటయు, నాకసి తీఱుటయు గూడ నొక్క కార్యమున సిద్ధించును. సుందరీ! ఏమందువు? ఈసిద్ధిని వివాహమాడెదవా?”

“ఎంత విపరీతము! ఎంత దారుణము!” జులేఖా కెవ్వున నఱచి, తద్భయావహారంగమునుండి తొలంగు దారివోలె చూచెను. తోడనే ఆభయంకరాకారుఁడు అయోమయముష్టిచే నాయబలను గ్రూరముగఁ బట్టును. కాని, అట్టి విష్ఠురాచరణ మనవసరము. ఏమన, భయాధికమున జులేఖా కరచరణములు కట్టువడిపోయెను. ఘాతుక మృగోచితభీమణవీక్షణములు నిగుడించి, భయానకముగ సిద్దీ యిట్లనెను. —

“నన్నుఁ దప్పించుకొని పాఱుట అసంభవము. అట్టిప్రయత్నము నిరర్థకము. నీవు నాయధీనవైతివి. ఒక్క క్షణమాత్రమున నిన్ను నాభుజబలమున నలిపివేయఁగలను.”

ఆనరాధముఁడట్లు తనయంతర మరకయుక ప్రేలినంతనే, జులేఖా క్రోధప్రకంపితయై, సుందరసంధ్యారుణరంజితవదనయై, విశాలతర

నయనయై, ఉద్విఘ్నస్వరంబున నిట్టులనెను.

"దురాత్మా! ఒకతెఱుంగక వదరుచుంటివి! నన్నుగాదు, మదీయ శిరోజమైనఁ దాక సాహసింతువేని, ఎట్టి కఠినశిక్షకుఁ బాలగుదువో తలంచి భయకంపితుఁడవు గమ్ము!"

"కాంతా! నాయునికి బయల్పడినను, క్రూరశిక్ష తప్పదు. కావున నన్ను వెలిపింపఁ బ్రయత్నింపకుము. సుందరీ! కాలహరణ మొనరింపక, నాభార్యవుగమ్ము. నేను ధనరహితుఁడనే నైనను, నష్టములేదు. నీయాభరణము లమూల్యములు. వాని సాహాయ్యమున మనమొక దూరదేశమున హాయిగనుండఁగలము. సుందరీ! ఐదు నిముసములలో మనము బయలుదేఱవలయు. ఈలోన నీయుల నట బాపికొని సేద దేఱుము. మఱియు మన హృదయములు గలయు నట్లు సముచితముగఁ బరస్పరము సంభాషింపవలయును. కాని, నా మానసమంతవఱకు నిలుపఁజాలదు — ఒక్క తియ్యని ముద్దొసంగుము!"

"ఆరే, దురాత్మా! పొమ్ము! అంతకంటె మరణము శ్రేయో దాయకము!" — అని యఱచి, ఒక్కనిసురున జేయివిదళించుకొని, క్రూరకిరాతపీడిత సుందర హరిణశాబకమువలె నా చపలాక్షి ఱివ్వున బాఱెను. సిద్దీ సహజముగఁ గ్రోధోన్మత్తుఁడై జలధరధ్వానమునఁ దిట్టుచు నఱచుచు వెన్నాడెను. జులేఖా ఏమికావలయు? కాని దైవవశమున నాదురాత్ముఁడు మార్గమధ్యమునఁ జచ్చిపడియుండిన కొండొక జంతువుం గానక, దాఁకి గుభాలున నేలఁగూలెను. దాన, నసహాయయగు జులేఖా మఱియు దవ్వాయెను. బానిసీఁడు సహజముగా ద్విగుణీకృత క్రోధఘూర్ణితుఁ డాయెను. నిజమానసంరక్షణ కార్యపరతంత్రయగు జులేఖా ఒక గమ్యస్థాన మెఱుంగక, తెరువు నరయక, ఇతరాలోచన మొద్దియులేక వాయువేగమున నట్టులే పాఱు చుండెను. సిద్దీ చాలవెనుకబడి యుండుటచే నామెకు నవీనధైర్య

మలవడెను. దాని జవంబుగూడ నధికతర మాయెను.

జులేఖా ఆతెఱంగునఁ గొంతదవ్వు పరుగిడెను. పునఃపర మాయారామపథము రెండాయెను. ఆభీతహరిణాక్షి ఎటుపోవలయును? ఎయ్యది క్షేమకరము? జులేఖా ఏమియు నెఱుంగదాయెను. వెనుదిరిగిచూడ, సిద్దీ గోచరింపలేదు. అంత నా పడఁతి లోలోన సంతసించి, నిలిచి, విచారించుట అపాయకరమని ఎంచి, దీనజనరక్షకుఁడగు పరమాత్మునిపై భారమువైచి, తన్ను బాధింపఁజూచు రక్కసుఁ డొకమార్గము బట్టునని ఎంచి, తాను రెండవత్రోవ ననుసరించి పతంగమువలె బాఱఁజొచ్చెను. కాని, ఎండ కన్నెఱుంగక రమణీయ సౌధాంతరమున భోగభాగ్యముల నోలలాడు కోమలి ఎంతదూర మటుపోఁజాలును? అంతలో నదృష్టవశమున నొకగృహము దృగ్గోచరమాయెను. జులేఖా తోడనే పెన్నిధిగాంచు నిఱుపేద చందమున, హారముఁజూచు దురంతక్షుధార్తు చాడ్పున నెంతయేని సంతసించెను. దుర్భరానందాతిశయమున నా కాంత అఱచెను.

నానావిధ వృక్షసమన్వితమై, నవవికసితకుసుమ నికరవిరాజితమై ప్రేక్షణీయమైయొప్పు నొకవిశాల ప్రదేశమునడుమ రమ్యహర్మ్య మొకటి శోభాయమానముగ నిలిచియుండెను. క్రూరశార్దూలమువలె వెన్నాడు సిద్దీబాఱినుండి తప్పించుకొనఁజాలు సాహాయ్యమందు లభింపవచ్చునని అయ్యబలామణి మానస ముప్పొంగెను. బహిర్ద్వారము తెఱచియుండుటచే, నామెకు మఱింతధైర్యము మలవడెను. కవాటముతీసియుండుటయు, ఉద్యానవన మడవివలె బలసియుండక కలకలలాడుటయు జూడ, నా మందిరము జనశూన్యము కాఁజాలదని జులేఖా గ్రహించెను.

జులేఖా మఱియొకసారి వెనుదిరిగి పరికించెను. సిద్దీ యింకను దోఁపలేదు. నూతనానందోత్సాహములచే వదనము వికసింప, నా మచ్చకంటి రయంబున నందుఁ బ్రవేశించి, వడివడిబోయి మందిరద్వా

రము డాసెను. తనయవస్థ యెటులున్నను అజ్ఞుఁడయి అందుఁ జొరనొల్లక జులేఖా తలుపుదట్టెను. కాని, ప్రత్యుత్తరము లేదు. మగుడ దట్టినను, లోనుండెడు వెవ్వరైన సరుకుచేయకుండుటయే గాక ఏమాటయు వినరాకుండెను. అవ్వల ఇంకను పిలిచినచో నారక్షకుఁడు చూచునేమోయని వెఱచి ఆమగువ అల్లన నందుఁజొచ్చి మగుడఁ దట్టెను. మందిరమట్టులే నిశ్శబ్దముగ నుండెను. ఆహా! ఆగృహము నిర్జనంబగుటయేమి? జులేఖాగతి ఏమి కావలయు? ఆ కాంత హృదయము మఱల భయకంపితమాయెను. అంత నాపడఁతి సాహసించి ఒక మందిరముజొచ్చెను. అందెవ్వరు లేరు. గదిమాత్రము సామాన్య పరికరసమృద్ధమై శుభ్రముగ నుండెను. అట్టిస్థలము జనశూన్యముగనుంట కడువింతగ నుండెను. ఆ మందిర మునకంటి మఱియొక ద్వార ముండెను. వివిధాలోచన బాధిత యగు జులేఖా అటుపోయెను. అంతలో భయంకరాకారుఁడగు సిద్ధీ ఏతెంచునేని, నిజమానసంరక్షణార్థ మందుజొరవలయునని చింతింపుచుండిన ముహూర్తమున నీవిపరీతాలాపములు వింతగ వెలువడుటచే, నాముగ్ధ అట్టెనిలిచిపోయెను. ఆ స్వరము బలహీనముగ మందముగ నుండియు నిరుత్సాహానంతమై, పురుషునిదివోలె నుండెను.

"సుందరాంగీ! నన్ను విడనాడకుము. నీదు మనోహరాకారము గాంచి ఆనందింపనిమ్ము — మదీయ హృదయము దురాలోచన పూరితముగాదు సుమా! — నిర్మల నిశ్చల ప్రేమముగ్ధుఁడనై తిలకించువాఁడను. ఆహా! అనిర్వాచ్యమధురార్ద్ర వీక్షణములు! — శతసహస్ర వందనములు. ఓహో! ఏమీ తరళనయనములు! — కడు మోహజనకములు. భవదీయ సువర్ణశిరోజములును, నక్షత్రవిరాజిత పక్షములును దివ్యకాంతియుతములై యున్నవే! సుందరీ! ఈప్రదేశమున నిరుపమాన తేజోవంత మొనరించు నీవు నాకమునుండిదిగివచ్చిన దివ్యాంగ

నవు గావలయు. మందహాసము! అపూర్వము! నిన్ను వెంబడించుట మహాభాగ్యము, నిజము, నిశ్చయము! స్వర్గమునకు గొంపోదువా! ధన్యోస్మి! ధన్యోస్మి నీయధీనమైతిని — భూతలము వీడితిని — వాయు విహారము! శరీరభావము శూన్యము—భూలోక సహజనికృష్టాలోచనలు పటాపంచలాయెను. — నిశ్చల ప్రేమానంద నిలయముగు సప్తమస్వర్గము జేరువాఁడను! మధురము! మనోహరము అపూర్వము!”

ఆపురుషుఁడు నాలుగైదు నిముసము లూరకుండెను. అనంతర మీ పలుకులు మగుడ వెలువడెను. —

“ఆహా! ఆకసమున నెంత రయంబునఁ బోవుచుంటిమి — వాయు వెంత తేజోవంతముగ, నెంతయుష్ణముగనున్నది! మదీయ భారము వహించు నీదుహస్తము సహితమెంత యుష్ణతరము! — నీను నయనములనుండి ప్రసరించి నాపైఁబడు వీక్షణము లెంత వికాసవంతములో! గాలిలో నడయాడు త్వదీయావిరళసువర్ణకుంతలము లెంకటి మధుర సుగంధము వెదజల్లుచున్నవి! నీదు మనోహరాంగము నాచ్ఛాదించు శుక్ల వినీల విమలకాచసన్నిభాంబరము నవరించు నపుడు నిక్కంపు దివ్యాంగనవలె దోఁచెదవు! ఓహో! మనము చాల దవ్వోగనియుంటిమి — ఈసమున్నత స్థానమునుండి కాన్పించు దృశ్యము కడు మనోహరము! అధోముఖంబునఁ దిలకింతునా? — మాతురుష్క రాజధాని వింతగఁ గాన్పించుచున్నది — ధగద్ధగాయమానములగు సువర్ణకలశములు — వైరిజన దుస్సాధ్యములగు దుర్గములు — అంబరము చుంబించు ‘మీనారు’ స్తంభములు — అన్నియు సువర్ణ బాలేందు విరాజితములు! వైభవాభిరామ విశాల సౌధములు జుట్టి యున్న పచ్చిక బయళ్ళు ఎంత శోభాయమానముగ దీపించుచున్నవి! భాస్వరసు జలములెంత సొగసుగ మెఱయుచున్నవి! ‘సువర్ణశృంగస్థ’ తోయములు ప్రకాశమానముగ నిశ్చలముగ నున్నవి! రాజమార్గము

బహుళజన సంకీర్ణము ! — మహావైభవ సమన్వితము ! — తెలిసె — పాదుషావారు ప్రార్థనార్థము పోవువారు ! అల్లదె ! — మౌల్వీ ఎలుగెత్తి గంభీరముగ దైవము నారాధించువాఁడు ! ”

ఆస్వరము మగుడ గొంతతడవు నిలిచెను. జులేఖా నిశ్చేష్టయై సంభ్రమాకులంబున నట్టియుండెను. —

“ ఆహా ! మఱియు మఱియుఁ బైకెగయు తారముగా ! సుందరీ ! దయామయచిత్తవై నన్నీ నికృష్ట భూతలమునుండి పవిత్రస్వర్గధామమునకుఁ గొంపోవు నిన్ను నేనెంతని కొనియాడఁగలను ? ఏమి — ఈ మృదుల మనోహరకలస్వనము ! వీనులకు విందగుచున్నది — స్వర్గము నలంకరించు మరువాన్నరీ రత్నములు పరమాత్మునకొనరించు ధన్యగీతములుగావలయు — ఎంత మనోహరము ! ఎంతమధురము ! — అపూర్వము — ఎన్నఁడు విని యెఱుఁగను. చూడఁజూడ, పృథ్వి చిన్నదియగుచున్నది — స్వర్గము చేరువయగుచున్నది ! నా యానంద మపారము ! అపూర్వము ! వర్ణనాతీతము ! ”

అట్టి పరమానంద మనుభవించు నామనుజుని స్వరము తదావేశమున నట్టులే కట్టువడెను. జులేఖాయవస్థ అనిర్వచనీయముగనుండెను. ఆపలుకున భావమేమి కావలయును ? దురదృష్టవశమున మతిచెడిన ఉన్మాదుఁడో, లేక, తీవ్రసన్నిపాతజ్వర పీడితుఁడో ఆ తెఱంగునఁ బ్రలాపింపవలయునని ఆమె గ్రహించెను. యథార్థమరయ వలయు ననెడు కుతూహలమేగాక, ఒకవేళ సిద్ధి యరుదెంచునేని వలయు సాహాయ్యమచ్చటనలవడునో లేదోయను భయముగూడ నుదయించుటచే, నా జవ్వని ధైర్యధుర్యయై, ద్వారమునఁ దొంగి పరికించెను. తెల్లని బానిసలిర్వురు జీవరహిత శిలావిగ్రహములవలె నొక సోఫాచెంతఁ గూర్చుండియుండిరి. తన్మృదులతల్పమున నొకవ్యక్తి వ్రాలియుండెను.

ఆ ముగ్వురును కదలక మెదలక కేవలము చైతన్య రహితముగ

నుండుటచే, ప్రాణములేని మైనపు బొమ్మగాఁ గానోపునని జులేఖాకు ప్రప్రథమమున స్ఫురించెను. కాని, అట్టిసందేహము రయమునఁ దొలంగెను. బానిసయొకఁడా మెత్తని మొగముఁద్రిప్పి, పెదవిపై వ్రేలిడి, కడు నిశ్శబ్దముగ నుండవలయునని సన్నయొనరించెను. ఆపరిచారకుని వీక్షణములు నిరపాయముగ నుండుటయేగాక, సవినయముగ సగౌరవముగ నుండుటచే, జులేఖా హృదయము భయరహిత మాయెను. అనంతర మాసేవకుఁడు తల్పమువంకఁ దిలకించెను: తదాశ్రితునకు నిద్రాభంగ మొనరింపరాదని వాఁడు హెచ్చరించెనని జులేఖా గ్రహించెను.

వనితాజనోచిత కుతూహలాధిక్యమున నాకాంత మఱింత తొంగి చూచెను. అంతవఱకు నాశయ్యాగతుని శరీరాకృతి బాగుగ గోచరింపలేదు. ఇపుడు సుస్పష్టమాయెను. తోడనే, హృదయము ప్రకంపింప, నాకాంత రయంబున వెనుదిరుగఁబోయెను. తదవసర విపరీత సంభ్ర మాకులంబున వెలువడు కంఠరవము నారించుటెంతయో కష్టమాయెను. సేవకజన పరివృతుఁడై తల్పమునఁబడియున్న పురుషుని ప్రాయ మేఁబది సంవత్సరము లుండునని తోఁచుచుండెను. అసలాతని వయస్సుముప్పదియైదుసంవత్సరములే, ఐనను, శరీరపటిమమాత్రము వాలుకక్కి. చిక్కి పలుచనై మాంసరహితమై, కేవలము కంకాళ సన్నిభమగు కాయము చూచుటకెంతయు భయానకముగ నుండెను. శరీరమంతయు మేల్వలువలతో నలంకృతమైయున్నను, దుస్సహశరీర దౌర్బల్యము ఘోరముగ వ్యక్తమాయెను. దట్టంపు మొగమలుదిండులపై వ్రాలియున్న ఆపురుషుని మస్తకమునకుఁ బ్రాపుగ రక్తమాంస రహిత కృశీభూతచర్మాంచితాస్థిమయ హస్తము మడఁచియుండెను. వాని మోము గూడ జీవరహితముగనుండెను. ఎముకల కంటియుండు చర్మము కాగితమువలెఁ బలుచనై నునుపుగనుండెను. నిమీలితములగు నయనములు రెండును రెండు బిలములవలె, గుహలవలె,

జూచుటకెంతయు దుస్సహముగ నుండెను.

అట్టి ఘోరకృత్యం జూడజాలక జులేఖా వెనుదిరుగుచు నొక పరిచారకునకు సన్నయొనరించెను. మృతప్రాయుఁడగు తన స్వామి మేనుమఱచి నిద్రించుటఁ గాంచి, వాఁడు పిల్లివలె మెల్లగ లేచి, జులేఖాను నిశ్శబ్దముగా సమీపించెను. గట్టిగ నూపిరిదీయుటకైన సాహసము చాలని ఆ సేవకుఁడు తమ ఉచితజాగరూకతతోఁ దలుపు సల్లనవేయు నంత వారిరువురు కొంతదవ్వునకుఁ బోయిరి. సేవకుఁడు సవినయముగ నిట్లు ప్రశ్నించెను. — "అమ్మా! సేవకునకేమిఆజ్ఞ?

"ఓయీ! నేను ప్రసిద్ధపురుషుడగు దల్తబను పాషా సోదరీ పుత్రిక నని యెఱుంగుము. పాషా బంధుమిత్ర సమేతముగా నీప్రదేశమున విహరింప నరుదెంచెను. ప్రమాదవశమున నేను వారిని వీడి వచ్చితిని. నేను శీఘ్రముగఁ బోవలయు - అసహాయనై వెడలఁజాలను-తోడు గావలయు."

"అమ్మా! మాయిరువురి యందెవ్వరమైనను నిన్ను నిరపాయముగాఁ జేర్పగలము — అట్టి కార్యము మాకెంతయు సంతోషకరము. కాని, మాప్రభువు మేల్కాంచువఱకు వేచియుండవలయు. మఱియొక పరిచారకుఁ డిందులేఁడు."

"నీ స్వామి శీఘ్రముగా మేల్కాంచునా?" అని జులేఖా తత్తరపాటునఁ బ్రశ్నింప, వాడిట్లు బదులాడెను —

"దేవీ! ఒక గంటయగును — రెండు గంటలు కూడ గావచ్చును. ఈలోన, అల్పాహారమాయత్తము చేయుదును, ఆరగింపుము."

"కాని, రెండు గంటలగునా? అంత కాలమిందుఁ దడయరాదు. నాకై నాబంధుగులు దుఃఖించుచుందురు. నీ ప్రభువు నిక్కముగ వ్యాధిగ్రస్తుఁడా? ఈః (నిద్రనుండి మేల్కాంచునని నాకుఁదోపకున్నది."

దేవీ! నీ కాభయము వలదు. నిక్కముగ లేచువాఁడు. సందియ ముడిగి వేచియుండుము."

"కాని, ఈ రోగమేమి? జ్వరాధికమున మేను పగిలిచి యట్లు ప్రేలునా? లేక, ఈ హతభాగ్యుఁ డున్మాదుఁడా!"

"దేవీ! ఎఱుంగనా? గ్రహించియుందువని తలంచితిని."

"ఎఱుంగను!" జులేఖా సంభ్రమము దశాధికమాయెను.

"దేవీ! ఇదంతయు నభిసీ ప్రభావము! ఈమహానీయుఁడు నల్లమందమితముగాఁ దినువాఁడు."

తానాపాటి గ్రహింపఁ జాలనైతినే యని జులేఖా కడుంగడు విస్మయము జెందెను. అట్టి వింతపూరుషుల నాకాంత యెన్నఁడు గాంచి యెఱుంగదు. ఐనను, అట్టి చిత్రముల నామె వినియుండెను. జదివియు నుండెను. అట్టి మందభాగ్యుని బ్రత్యక్షముగఁ గాంచుటచే నామె హృదయము కంపించెను – "హా! దైవమా! – పరిచారకా! ఎంత దురదృష్టము! ఇట్టి దారుణదుర్వ్యసనమునకుఁ బాల్పడి నీ ప్రభువు మెల్ల మెల్లగ నాత్మహత్య యొనరింప నెంచెనా?"

"దేవీ! తనజీవితకాలమునం దర్ధభాగ మీతఁడు స్వీయమనో పరికల్పితస్వర్గమునందు వసియించువాఁడు: ఇంతటి ప్రభావముగల సిద్ధౌషధము నోరార సేవించి మనసార ఆనందించుటకుగా నీ నిర్మానుష్యప్రదేశమునకుఁ బ్రత్యేకముగా నరుదెంచి ఇందు స్థిరవాస మేర్పఱచుకొనెను –"

ఆముహూర్తమున నవ్వల కాలియడుగులు దబదబ వినవాయెను. జులేఖా భయప్రకంపితహృదయయై, అనిమిషనయనయై, అటు తిలకించెను. సిద్దీ భయంకరాకార మామె మనోనయనమునకు గోచరించెను. కాని, యథార్థ మన్యథా పరిణమించెను. ఖాలీలుని అపూర్వమనోహరమూర్తి నయనగోచరమాయెను; జులేఖాహృదయ ముప్పొంగెను: వదనము వికాసవంతమై అనిర్వచనీయానందమున కాలవాలమాయెను –

"ఇయ్యది, నామిత్రుఁ డొకఁ డగుదెంచెను!" అని యతం డానందకంపితస్వరంబున నఱచి, సంచి వడివడి దీసి, కడువినయముగ మెలంగిన పరిచారకున కొక సువర్ణ మొసంగి జులేఖా రయంబున నావలకుబోయెను.

నిజమనోహారిణిం గాంచినంతనే ఖాలీలుఁడు కూడ విస్మయానంద పరవశుఁ డాయెను. తత్క్షణమా యువతీయువకులు పరస్పరము గాఢా లింగన మొనరించిరి. అనంతరమా లతాంగి నిజహృదయాధినాథు భుజాదండము నాశ్రయించి, యల్లన నడచుచు స్వీయకథా విశేష ములు తెలియఁబఱచెను. దల్లబను పాషా నిద్రాపరుం డగుటయు, నవ్వాడి యైనంతనే తా నవ్వల కేగుటయు, సిద్దీమస్రూ దయ్యము వలెఁ బైఁబడి ఎత్తుకొని పోవుటయు, వాని దుస్సహాప్రవర్తనమును తాను తప్పించుకొని ఆగృహంబునఁ బడుటయు మొదలుగాఁ గల విషయములు జులేఖా యభివర్ణింప, ఖాలీలుఁడు సహజముగా నాగ్ర హాయత్తచిత్తుఁ డాయెను.

మస్రూ ఆప్రదేశమున నం దైన డాగియుండునని అనుమానించి, ఖాలీలుఁడు తన సునిశిత కరవాలము జేతఁబూని అప్రమత్తుఁడై యుండెను. కాని, వాఁడా మార్గమునఁ గాన్పింపలేదు. తాను వెను దవిలిన ఆయుధహూధముఁడు నీటమునిఁగి చచ్చియుండునని తురుష్క యువకుఁడు నమ్మియుండెను. వాడట్లు గతింపక, ఇంకను సజీవుడై యుండెనని స్పష్టమాయెను. పరస్పరానురాగబద్ధులగు నా యువతీ యువకులు పరస్పర మెఱుంగని రహస్యములు లేవు. కాన, మార్గ మధ్యమున నాయువకుఁడు తన ప్రియాంగన కెన్నియో విషయము లెఱింగించెను.

జులేఖా ఖాలీలునను గాంచినంతనే, పాషా మొదలగు వారం దఱు గగుంగడు ముదమందిరి. జులేఖా నరయుటకు వేర్వేరు పథంబుల

బులఁ బోయిన జాలియను లూకాసు లప్పుడే యరుదెంచియుండిరి. ప్రభుప్రత్నియగు ఇస్మిల్డా హృదయము గర్హిత మాత్సర్య సర్పదష్ట మాయెను. హృదయ మెంత యుడుకుచున్నను నిశ్చలముగఁ గాన్పింపవలసిన కారణమున, నాముత్తకాళిని యవస్థ మఱియు దుస్సహముగ నుండెను. జులేఖా మఱలఁ దన భయావహ వృత్తాంతము సమగ్రముగ వినిపించెను. తన సేవకాధముఁడు మన్సూరే అంతటి దౌర్జన్య మొనరించెనని ఎఱింగినంతనే, దల్తబనుపాషా ప్రచండ క్రోధారుణనేత్రుఁడై, పండ్లు పటపట గొఱికెను. మేధావియు సమయజ్ఞుఁడును నగు ఖాలీలుఁడు సిద్దిని మును దానెఱుంగనట్టులె మెలంగెను.

అనంతరము వారలందఱు నల్లనఁ దమ నావచెంతకుఁబోయి, అందాసీనులై గృహాభిముఖులైరి. సంభాషణము సహజముగా జులేఖా భయానక సాహసోదంతము మీఁదనే కేంద్రీకృతమాయెను. ఆ సందర్భమున లూకాసు ఇటులనెను. — "జులేఖా! నిన్ను అన్వేషింప బోయినపుడు నా చిత్తము పరిపరివిధములుపోయెను. బాల్కను దేశమునంతటిని గడగడలాడించి కల్లదొంగను బోలు మఱియొక క్రూర చోరాధమునకైనఁ జిక్కియుందువని నేనెంతయు భయమందితిని."

దల్తబనుపాషా తోడనే యిట్లు పలికెను. —

"ఔనౌను. ఆనల్లదొంగ మొన్నటివఱకు జీవించియుండెననియే జ్ఞాపకము. కడుంగడు ప్రవీణుఁడగు నా గజదొంగ యొనరించిన వైపరీత్యములు జనులు భయాద్భుతస్వరమున జెప్పుకొనుచుందురు.

"అట్టి గాథలలో నొక ఫ్రెంచి బాటసారికి సంబంధించినది కడు ప్రసిద్ధము, కడు విపరీతము. ఒకానొక వార్తాపత్రికయందుఁ గాంచియుంటిని."

అట్లు లూకాసు మగుడ బలుక, పాషా సాశ్చర్యముగ నిట్టులనెను:

"మిత్రమా! అటులనా! మనమిత్రుఁడు ఖలీలుఁ డొక్కదినము

రెండు కథలు జెప్పవలెను గాని, నివాభారము వహించి, అత్యెంచి బాటసారి కథ వినిపించి సహాకారానంద ముత్తగూర్పుము. ”

లూకాను అమితోత్సాహ సీపితానన్నుడై తత్కార్యమున కుద్యమించెను.

## ౨౩

### రహస్య యుద్ధ నౌక

లూకాను కథ పూర్తియైనంతనే, దల్బబనుపాషా యథావిధంబునఁ జింతాపరుఁడై ఇట్లుపలెను. —

“ ఖాలీలుని కథలవలె నియ్యది చరిత్రాధారము గాకున్నను, కడు నానందకరముగనే యుండెను. తత్కథానాయకుఁడగు త్రెంచివీరుఁడు నాయికను గాంచినంతనే ప్రేమముగ్ధుఁడాయెనని తోచెడిని. ఇట్టి ప్రేమము వీక్షణమాత్రజనిత మని చెప్పనొప్పును. ఈసిద్ధాంతమును ధృవపఱచుటకును, ఖండించుటకునుగూడ సమానావకాశములున్నవి. ”

దల్బబనుపాషా సహజహంకార పూరితస్వరంబున నటులు పలుక, ఖాలీలుఁ డిట్లులనెను —

“ పాషా ! వీక్షణమాత్ర ప్రేమ సిద్ధాంతము కడుంగడు సమంజసము. ఎయ్యది సమంజసమో, అయ్యది స్వభావసిద్ధమని చెప్పఁదగును. నాయభిప్రాయము విశదీకరింతును, గమనింపుము. సౌందర్యము నేత్రానందకరము, తత్క్షణ హృదయానురాగ ప్రభవకారణము. కావున, తొలుదొల్తనే అనుకూలాభిప్రాయ మేర్పడఁజేయఁజాలు సామర్థ్యము సౌందర్యమునకుఁ గలదు. అట్టి అభిప్రాయబద్ధుఁడు తాఁ గాంచు కాంత వదన సౌందర్యము తదీయ హృదయ ప్రతిబింబితమనియుగూడ ప్రశంగవశమున నరయఁజాలునేని తదనుకూలాభిప్రాయము ధృవంబగును. వీక్షణమాత్ర జనితప్రేమతత్త్వ మియ్యది.”

దల్తబయుపాషా తోడనే యిట్లు బదులాడెను. —

“నీపలుకు లసంబద్ధములు గావు: అట్టి ప్రేమము గలదు — శాశ్వతముగూడ గావచ్చును. ఏమన, పరస్పరము హాయిగ మేళ వించు హృదయములే విధికృతంబున నొక్కెడ సమకూడును. కాని, మఱియొక విషయము గమనింపవలయును. వీక్షణ మాత్రమున నాక స్మికముగ నేర్పడు ప్రేమ అట్టులే క్షణభంగురము గానోపు. ఎట్లు జనించెనో, అట్టులే యంతరింపఁగలదు. ఇయ్యది సాధారణ సంభవ మని భావింతును. అట్టిప్రేమ అభంగురమై, నిశ్చలమై, సుఖప్రదమై యుండఁజాలదు. సౌఖ్యదాయకము గాకుండుటయే గాక, అట్టి దంపతు లలోనొక్కరికైనను సంతాపకారణమై బాధాకరముగ బరిణమించును.”

ప్రభుపత్ని ముసుంగునుండియే భావగర్భితముగ వీక్షింపుచు నిట్లనెను—

“తరుణ వయస్కుఁడగు పురుషుఁడు అమితోత్సాహపరుఁడై, అనివార్యమోహావేశము కతమున, యుక్తాయుక్త వివేచనా సామర్థ్య ముడిగి, తదవసరోద్భూత మనోవికారము విమల నిశ్చలాను రాగమని భ్రమించి, ఒక సుందరిని ప్రేమించి, తదుత్తరదినముననే, తదుత్తరఘటికయందే తత్సమానావేశమున మఱియొక వాల్గంటిని గాంచి వలచును. ఖలీలు మహాశయా! నాపలుకులు నిక్కముగదా!”

అట్లు పలుకు ఇస్మిల్డా క్రూరతీక్ష్ణ వీక్షణమొండు జులేఖాపై బఱపెను; ఖలీలుఁడు కనిపట్టెను. ప్రభుపత్ని మానసమెటులుం డెనో ఆతఁడు గుర్తించెను. ఆకస్మికముగ నంతర్హితమైన జులేఖాను అన్వేషించుటయందు ఖలీలుఁడు వ్యక్తీకరించిన గాఢోత్సాహముచే నిస్మిల్డా మాత్సర్యము మగుడ నుప్పొంగి నిల్చెను. లూకాసు జూలియనులు గూడ వెనుకబోయినను, ఖలీలుఁడే ఆకన్నియ నరయఁజాలెను. ఆకారణమున నాయువతీ యువకులు కొంతకాల మేకాంతముగ నుండుటకు వీలాయెను. నిర్మల ప్రేమ మన నెట్టిదో యెఱుంగని

ప్రభుపత్ని, నిశ్చలానురాగమెద్దియో యెఱుంగని ప్రభుపత్ని, దుష్ట కామా యత్తచిత్తయగు ప్రభుపత్ని, ఖలీలుని గాంచి మోహాతురయై ఉవ్విళులూరు ప్రభుపత్ని ఆతఁడు మఱల జులేఖాతో నొంటిపాటుగ నుండెనని యెఱింగి ఎట్లు సహించును ? కావుననే, నిజహృదయాంతర ప్రజ్వలిత క్రోధ మొకింత యుపశమనము గాంచునట్లు వీక్షణమాత్ర ప్రేమము గుఱించి యట్లు లుపన్యసించి ప్రశ్నించి ఆమె తురుష్క యువకుఁ గారింపఁగడంగెను.

గభీర హృదయుఁడగు ఖలీలుఁడు ప్రభుభార్య వక్రహృదయ మెఱింగియు, సహజ నిశ్చల స్వరంబున నిట్లులనెను. —

"దేవీ ! నీపలుకు లణుమాత్ర మసంబద్ధములుగావు. ప్రత్యేకముగఁ గొన్ని యుదాహరణములం దీసి విచారింతుమేని, మన మట్లు వాదింపనగును. అట్లుగాక, పాషా విశాలహృదయముతో నొక సర్వసామాన్యవిషయము మాత్రము ప్రశంసించెను."

పాషా యిట్లులనెను. —

"మన మిత్రుఁడగు లూకాసు కథా శ్రవణమువలనను, తదనంతరాలోచనా పరంపరచేతను మదీయ మానసము నాశ్రయించియుండిన ప్రధాన విషయము మఱచితిని."

నిజభర్తృఘాతము దలపెట్టిన ఇస్మిల్లాతోడనే విహ్వలహృదయ యయ్యు నిగ్రహించుకొని, నితాంత విమలానురాగపూరిత చిత్తవలె నభినయించి, మధుర మందహాస విరాజిత ప్రసన్నాననయై మగని వంకఁ దిలకించి, మనోహర కలస్వనమున నా ప్రధాన విషయమెద్ది యని ప్రశ్నింప పాషా యిట్లు బదులాడెను. —

"మహాత్ముఁడగు మస్రూ గుఱించి తలఁచుచుంటిని. జులేఖా నీజనకుఁడు నగర రక్షకుఁడు గదా ! మన మిలుసేరునంతనే, భటులను నలుదిక్కుల రయంబున నంపి సిద్దీని బట్టవలయునని కదీస్కారుకు

వర్తమానమంపుదును.”

నౌక మెల్లగఁ బోవుచుండెను. వారింకను ఉపనదిమీఁదనే యాన మొనరింపుచుండిరి. అటు నిటు నుండు గట్టులు వృక్షసంకీర్ణములగుటచే బాస్వాసు కానరాకుండెను. క్రమముగా నాజలమార్గము గడచి బాస్వరసు జొచ్చినంతనే, వారి యుత్సాహమంతయు నడంగెను. భయముచే గాకున్నను, విపరీత విస్మయ సంభ్రమములచే వారి హృదయము కంపించెను. కారణ మేమన, తురుష్కదేశముతో సఖ్యములేని రష్యాదేశపు యుద్ధనావయొకటి తద్దేశ లాంఛనమగు కేతనముతోఁ గృష్ణసముద్రమునుండి బిఱబిఱ సరుదెంచుచుండెను.

అంతమాత్రమున వారి హృదయములు చలింపనేల? టర్కీ రష్యాదేశములు కొంతకాలము పరస్పరసంగరమున మునింగియుండెను. ఇంగ్లాండు రష్యాదేశమునకుఁ దోడ్పడెను. ఐనను, ఇంగ్లాండుదేశము వలననే వైరులిర్వురు సంగ్రామమును విరమించియుండిరి. అంతమాత్రమున యుద్ధభయము తొలంగెనని తలంపరాదు. ఇరుపక్షలవారు నామోదించు సంధి పొసగదలయును. తత్కార్యము సాధింపఁగోరియే ఇంగ్లాండు ప్రోత్సాహముచే టర్కీ రుష్యాదేశములు రణ ముడిగియుండిరి. రాజనీతిజ్ఞులు సంధికార్యరచనామగ్నులై యుండిరి. అట్టిసమయమున శత్రునావ తమ జలముల నేల ప్రవేశింపవలయు? దత్తబసుపాషా సహజముగ భయసంభ్రమ విచలితహృదయుఁడై ఇట్లనెను:

“ఏమీ వైపరీత్యము! సంధి కాఁగల ఈ విరామ సమయమున రష్యను యుద్ధనావ మన జలముల చొరనేల? సమర విరామము భంగపడలేదే!”

ఆనావ దృగ్గోచరమైనంతనే ఖలీలుఁడు దగ్గున లేచి తద్దేశధ్యానమున నావంకఁ జూడ్కులు నిగుడించి “కడు విపరీత”మని యనుకొనెను.

“ఈ యాగమనము స్నేహపూర్వకము కారాదా! వినోదార్థము

కారాదా? అకారణముగా రష్యాదేశము యుద్ధవిరామ నియమముల నుల్లంఘించుననని భావింపను."

ఆ తెలుంగున లూకాసు పలుక, పాషా యిట్టులనెను—

"ఈనావ దురాలోచనాయత్తమై యింత దవ్వరుదెంచెనేని, మన యుద్ధనావ లూరకుండునా? 'సువర్ణశృంగము'న నిలిచియుండు మన నౌకాబలము తప్పక ఎదిరించును."

"అపాయమును సంభవించునా!" అని ప్రభుపత్ని భయోద్విగ్న స్వరంబునఁ బ్రశ్నించెను. తైరజా గుల్నేరులుకూడఁ దత్సమాన భయముచేఁ గంపించిరి. జులేఖా మాత్రమట్లు చలింపక, శత్రునావ పరీక్షానిమగ్నుఁడగు తన ప్రియు నల్లనల్లనఁ దిలకింపఁ దొడంగెను.

భయాతురమునఁ బ్రశ్నించిన భార్యకు దత్తబనుపాషా సమాధాన మొసంగక మున్నె, ఉద్విగ్నస్వరమున ఖలీలుఁ డిట్టులనెను—

"తెలిసె! తెలిసె! పాషా! రష్యను నావికులు అల్లదె— శ్వేతకేతనము నెత్తువారు! వారు దుష్టాభిప్రాయబద్ధులుంగా రనుట సువ్యక్తము!"

అంతటి బుద్ధికౌశల్యమె ఱుంగని పాషా వారి యభిప్రాయ మేమై యుండునని ప్రశ్నించెను. ఖలీలుఁ డిట్లు బదులాడెను:

"ఇవన్నియు యుద్ధవిరామ దినములుగదా. టర్కీ. రష్యాదేశములు పరస్పరము సమ్మతించుటచే నన్యోన్యాధీన యోధజనంబును సాగనంపుచుండిరి. యుద్ధమున మనకుఁ జిక్కిన రష్యను ప్రముఖుల నెక్కించుకొని వారి నగరమున దిగవిడుచుటకొఱకు మన నావ యొకటి నాలుగు దినములక్రిందఁ బ్రయాణమాయెను. అట్టులే, వారి యధీనమైన మన యోధులను మన కప్పగించు నెపమున నీరష్యను నావ యరుదెంచి యుండవలయు."

ఖలీలుని ఊహ నిక్కమగునా యని తర్కింపవలసిన యవసరము లేకపోయెను. శాంతసూచిత శ్వేతపతాక ప్రదర్శనమున వారి

వారి భయానుమానములు పటాపంచలాయెను. ఆనావ ఒక యర మైలు దవ్వున గోచరించెను. తెరచాప లన్నియు లేచియేయున్నను వాతావరణము తీవ్రానిల పీడితముగాక నిశ్చలముగ నుండుటచే గమనము కడు మందముగనుండెను. ఆకారణమున, భాసుర భాస్వ రను జలపర్యంకమున గంభీరతరముగ నిలిచియున్న ఆ జలగామి చూచుట కెంతయు శోభాయమానముగనుండెను. బాగుగఁ జూచి యానందింపగోరి తమ నౌక నౌకింత దవ్వుగఁ బోనీయవలయునని దల్తబను పాషా తన బానిసల నాజ్ఞాపించెను.

మగువలుఅన్యనౌకావీక్షణోత్సాహపరతంత్రలై తమ మేలుముసుం గులను బోఁద్రోచిరి. రష్యను నావపైఁ బెక్కు దూరవస్తుదర్శనయంత్ర ములు పొడసూపెను. అయ్యది పాషానౌకపై నిగిడియుండెను. అనూనసౌందర్యముతో నలరారు నా మేల్బంతుల వంకఁ దిరిగిన దూర దర్శనయంత్రములు సహజముగ మరిమరలుదిరుగక అట్టులేనిలిచిపోయె ను. హరింబట్టు వితానాంతరమున, మెత్తని మోహంపు దిట్టంపుదిండు లపై మనోహరతరంబుగ వ్రాలి, ప్రాచ్యదేశనారీజనసహజాపూర్వరూప వైభవంబులతో విద్యుల్లతాసన్నిభముగ దీపించు నిస్తుల్యాతెరజా జాలేఖా గుల్నేరుల నొకసారి గాంచిన యనంతరము దృష్టి మరు ల్చుట అసంభవము గదా! ప్రభుపత్ని ఆ విషయము గమనించిన గమనించి యుండుగాని, మిగిలిన జవ్వనులు మువ్వురు మాత్ర మేమి యు నెఱుంగక అట్టులే చూచుచుండిరి. ఖాలీలాది యువకులు రష్యను దూరదర్శినీయంత్రముల మర్మము గ్రహించియు, అనాచ్ఛాదితవదన లగు నా యువతులపై దల్తబనుపాషా కినియు నేమోయని వెఱచి, మిన్నకుండిరి. రెండుమూడు నిముసములు గడచిన యనంతరము పాషాయే గ్రహించి, యదరి ఉద్విగ్నస్వరంబున నిట్టులనెను.

"వదనముల నాచ్ఛాదింపుడు! సత్వర మాచ్ఛాదింపుడు! ఆ

కాఫరులు మిమ్ము గాంచువారు!"

తోడనే ఆ సుందరీమణుల మనోహరవదనబింబములు వసన మేఘా చ్ఛాదితము లాయెను. తోడనే ఆ దూరదర్శనయంత్రము లొకొక్కటి స్థానభ్రంశమాయెను.

ఖాలీలుని ఊహాయే నిక్కమని పాఠకులు గ్రహింపవలయు. రణమునం దమ యధీనమైన రష్యను యోధులను తురుష్కులు నాలుగైదు దినములక్రిందట సంపియుండిరి. ఆ విధంబుననే, తమ యధీనులైన తురుష్క యోధులను రష్యను నావ యిపుడు కొనివచ్చెను. ఆ యుద్ధనౌక ముప్పదియారు ఫిరంగులు గలిగి కడు బలాఢ్యముగ నుండెను. కులీనుండగు యువకుం డొకం డందు నాయకత్వము వహించి శాసించుచుండెను. యుక్తాయుక్తము లెఱుంగని ఆ బాలనాయకుడు సాహసకార్యము లొనరించి కీర్తికాంతాకరగ్రహణ మొనరింప వలయునని కడుంగడు దత్తరపడుచుండెను. ఏదియేని ఒక కార్యము దలపెట్టి సాధింపం గడంగునపుడా సేనాని మంచిచెడ్డ లరయుట గాని, పాప పుణ్యములు పరిగణించుటగాని, యెఱుంగడు. తురుష్కజాతిపై నాతని కెంతయేని గుజుప్స. అట్టి గర్విష్ఠక్రోధదురహంకారపూరిత హృదయుండు తాం గొనితెచ్చిన తురుష్క యోధులు నౌకోపరి భాగమున నిలిచి స్వదేశమును సంతసమునం దిలకింపంజాలు నవకాశ మీయక, దుష్టమతియై వారి నధోభాగమున నుంచెను.

సేనానియగు నివనుండు నిజసహాయాధికారజనపరివృతుండై ఎద్దియో ముచ్చటించుచు బాస్ఫరసు రమణీయదృశ్యములం గాంచు సమయమున దల్తబనుపాషానౌక నయనపథంబునం బడెను. ఆసమయమున నితరనౌక లేవియు నాప్రాంతమున లేవు. చిత్రవర్ణవిరాజమానమై, మనోహరమైయొప్పు నాలకము గాంచినంతనే ఆ నావాధికారి కుతూహలపరుండై దూరదర్శినిందీసి చక్కగజూచుచుం బోయెను — "నల్లనినావికు

లార్వ్వరా నౌక నడుపువారు మన నావికులవలె వారును నేర్పరులు గావలయు! ఓహో! మనలఁ గాంచి వెఱచి యున్నారు — ఎటు తిరుగ వలయునో నిర్ణయింపఁజాలక తిల్లడిల్లుచున్నారు! ఆహా! అందుసుందర నారీమణులు గూడ నున్నారే! అట్టిసొగసుకత్తెలను ఓడ్గఱనుండి కను లారఁ గాంచవలయు! మనలఁ గాంచి వారు భయకంపితులై యుం దురు — సత్వర మాశ్వేత కేతనము బ్రదర్శింపుఁడు!"

భటులిటు లొనరింప, నాతఁడు మగుడ నిటులనెను — "భళీ! అదృష్టమే! ఆ నౌకయే ఇటు లరుదెంచుచున్నది! మిత్రులారా! చూడుఁడు! అందలి సుందరులు మేలి ముసుగులు దొలఁగఁ ద్రోయు వారు! మీరును మీయంత్రిసాహాయ్యమున మీనయనములకు విం దొనరింపుఁడు." — ఉపనాయకు లటు లొనరించిరి. — "ఆహా! ఏమి సోయగము! మిత్రులారా! తురుష్క నారులు సహజముగఁ గడు సుందరులు; కాని తమ సౌందర్యము నిరుపమానమని మెఱుంగు మెఱుంగఁబోవుటే ఆపగిది నిబ్బరముగ, దమ వదనము లను బ్రదర్శింతురు!"

ప్రధానోప సేనానియగు 'నికోలసు' సమంజసముగ నిట్లు బదు లాడెను. —

"ఆర్యా! మనము దూర దర్శనయంత్రములతోఁ బరీక్షించు చుంటిమని తెలియక, మన నావను జక్కగఁ గాంచవలయునని నెదు శుతూహలమునసే వా రనాచ్ఛాదితవదనలై యుండవచ్చును."

అనంతర మాయధికారులందఱు తురుష్క నారీజన పరిశీలన కార్య నిమగ్నులైరి. ప్రధాన సేనానియగు ఐవనుఁడు మగుడ నిట్టులనెను:

"ఏమీ మోహనాంగుల రూపురేఖా వైభవములు! మిత్రులారా! యిట్టి మనోహర నారీమణుల మీరెన్నఁడైనఁ గాంచి యుందురా? నాకీ నావపై నున్నటులే విస్పష్టముగఁ గాన్పించువారు. ఆకర్ణాంత

విశాలములగు నామచ్చెకంటుల నయనము లపూర్వ మోహజనక ములే! ఛీ! ఏమీ యాగడము? వదనములు ముసుఁగు నాచ్ఛాదితము లాయె! —"

"నిజము! విరాజమాన సక్షత్రము లొక్కసారి మాయమైనటు లాయెను."

"నెఱసిన గడ్డములుగల ఆస్థూలశరీరుఁడేమియో తీవ్రముగఁ బలికి నటులున్నది —"

ప్రధానోపనాయకుఁడగు నికోలసు ఇటులనెను. —

"మేలు ముసుంగులు దాల్పవలయునని ఆతఁ డాజ్ఞాపించియుం డును. వాని పేరు టురంబుపై దీపించు లాంఛనములు గాంచితి — ఆతఁడొక పాషా కావలయు. మన మటు లవిరళముగఁ గాంచుట యసంగతము గదా. ఇఁక నామోహనాంగుల మనోహరవదనములు మనకుఁ దెల్లమగుట కల్ల."

"తెల్లమగుట కల్లయా! తద్వీయాలాప మారుతాహతి నాహృ దయము విపరీతముగఁ గలంగెడిని! నా మానస మమితోత్సాహ పూరితమై —"

"ఆర్యా! ఇయ్యది యుద్ధవిరామదినములసియు, మన మిపుడు శాంతిధ్వజ మెత్తితిమనియు గమనించి జాగరూకుఁడవు గమ్ము, తీవ్రాచరణము తగదని మనవి చేయువాఁడను."

"ఇయ్యది యుద్ధవిరామ సమయమగుట నిక్కము. ఐననేమి, ఆతురుష్కముదుకఁడు — పాషాను, ఆసుందరనారీజనంబులను ఊరక పోనీయరాదు. ఇదియొక దోషము కానేరదు."

అనుభవజ్ఞుఁడగు నికోలసు తన నాయకుని దుర్బుద్ధి మరలింప నెంతయు బ్రయత్నించెను. మహాభిమానియగు తురుష్కుఁడు తన కాంత కెంతస్వల్పమగౌరవము ఘటిల్లినను సహించువాఁడు కాఁడని

ఆతఁడు దెలియఁబఱచెను. ఐనను, యుక్తాయుక్తము లెఱుంగని ఐవనుఁడా హితవాక్యములు పెడచెవిని బెట్టి ఇట్టులనెను — "మిత్రమా! ఇం దగౌరవమేముండును? ప్రసిద్ధుఁ డగు రమ్యాను సేనాని వాంఛించుటయు, తురుష్క నరాధముఁడు నిరాకరించుటయునా? ఇఁక నాకాంతల గుఱించియా! — ఎండ కన్నెఱుంగక అంతిపురంబునఁ జిరకాలము నవయు వనితలు మనవంటి ప్రముఖులతో ముచ్చటించుటకుఁ దప్పక తత్తరపడుచుందురు."

"ఆర్యా! అందు పాషాయొక్కఁడే గాక తరుణ వయస్కులగు మువ్వురు సుందర పురుషులు గూడ నున్నవారు సుమా!"

అనుభవజ్ఞుఁడగు నికోలసు ఎంత వారింపఁ బ్రయత్నించినను ప్రయోజనము లేక పోయెను. వారించు గొలఁది, వాని యాతుర మధికతరమాయెను. తాను ముందుగ వారి చెంతకుఁ బోయి, వారిని దన నావమీఁదకు నాహ్వానించి, ఉపాయమున నాయువకులను దొలంగించి తా నాకాంతలతో సరస సల్లాపములాడి తీరుదునని ఐవనుఁడు దుర్మదాంధమునఁ బంతములాడెను. పూర్తి తురుష్క నారీజనశీల మెఱుంగని ఆ మూర్ఖాగ్రేసరుఁడు చలము వహించి యుండెను. యుద్ధవిరామ సమయమున నెంతటి యల్పకార్య మొనరించినను, దావానలాభీల సమరజ్వాలలు మగుడ రెండు దేశములను భస్మీభూత మొనరింపవచ్చునని ప్రధానోపనాయకుఁడు హెచ్చరించినను, ఆశకుఁడు వినఁడాయెను. నాయకుని ఆజ్ఞయగుటచే, నొక చిన్న నౌక ఆయత్తమాయెను. చక్కని రమ్యాను నావికులార్గురు నౌకాదండములు బూని సిద్ధముగనుండిరి. వారందఱు ఖడ్గధరులై యుండిరి. సాయుధుఁ డగు నైవనుఁడు గూడ తోడనే యం దాసీనుఁ డాయెను. నౌక తత్క్షణము రయంబునఁ బోసాగెను.

ఆముహూర్తమున పాషా నౌక వెనుదిరిగి గృహోన్ముఖ

మాయెను. రష్యాను యుద్ధనావను జూచు కుతూహలము తీఱుటచే వారిక దమ నిలయమునకుఁ బోనుండిరి. అట్టి సమయమున రష్యాను సేనాని నౌక ఆయ త్తమాయెను. ఆవిషయము గాంచిన పాషా ఇట్టులనెను — " యుద్ధనావనుండి ఎవ్వరో దిగుచున్నారు. " ఖలీలుఁ డిట్టులనెను.

" నిజము. ఆయుద్ధనావ వడివడి మన రాజధానిజేరి తన కార్యము నిర్వ ర్తించుటకు మాఱు లంగరు వేయుచున్నది. నౌక వాయువేగ మునఁ బఱ తెంచుచున్నది ! మనవంక కే యరుదెంచుట లేదుగదా ? "

ఖలీలుని అంత్యవాక్యము స్వగతప్రాయము. తన యందనుండు కాంతలు భయమందుదురను భయమున నాతఁ డాపలుకు బిగ్గరగ నుచ్చరింపలేదు.

" ఆనౌక సూటిగ మనమీఁదకే వచ్చుచున్నది ! " అని లూకాసు సవిస్మయముగ ననెను. ఇస్మీల్డా మగుడ భయవిహ్వలయై "అపాయము సంభవించునా ? " యని ప్రశ్నించెను. పాషా యిట్టు లనెను :

" మొఱకులగు రష్యనులు గౌరవమర్యాద లెఱింగినవారు కాకున్నను, శ్వేతపతాకము బ్రదర్శించి కలహమునకు గాలు ద్రవ్వుదురని తలంపను. ఐనను, యుద్ధనావ అచట నిలుచుటయు, దూరదర్శన యంత్రములు మఱలినంతనే ఈనౌక బయలుదేఱుటయు వింతగఁ దోఁచెడిని. "

ఖాలీలుఁ డిట్టులనెను —

"వనితాజనంబులకు భయములేదు. ఆనౌకయందార్వురునావికులును ఒక ఉద్యోగియుం గలరు. మనము పదిమంది యున్నారము. "

" కాని, మన నావికు లాయుధహస్తులుకారు. ఐననేమి ? మనము నల్వురము సాయుధులము, కృతహస్తులము గదా. మృగప్రాయులగు ఈరష్యనులఁ పాడి ద్రొఱంగి దురాలోచనాయ త్తచిత్తు లగుదు రేని,

మన భుజబలము జవిగాంతురుగాక ! — కాని, వారేమైన నరయఁగో
యిటు రావచ్చును. ఇఁకముందు పోఁజాలక తగు నావికునకై తత్తర
పడవచ్చును—"

యోధపురుషుఁడగు దత్తబనుపాపా యట్లు లుచితముగఁ బలుక,
ఖలీలుఁడు మందస్వరంబున నిట్టులనెను—

"పాపా ! ఏసమాధానము కావలసియున్నను, ఇట్లు రానవసరము
లేదు. ఈ ప్రదేశ నైసర్గికము దెలియు మన జాతివాఁ డొక్కఁడైన
నందుండకపోఁడు."

వారాతెలుంగున గుసగుసలాడుచుండ, ప్రభుపత్ని విపరీత భయా
తురంబున ననిమిషనయనయై, స్వేదకణవిభూషితవదనయై మగనిచెంత
కరుదెంచి, ఆతని భుజముల నాశ్రయించి యిట్టులనెను—

"ఈ సమయము నిక్కముగ నపాయకరము ? నాథా ! మాటాడ
వేమి ? "

"ప్రేయసీ ! భయము వలదు. ఈ చర్య నాకును గ్రాహ్యము
కాకున్నది—నాహృదయము భయాధీనము కాదు. గాని, విస్మయగ్ర
స్తమైయున్నది. ఈ రిమ్యనుల కేమిగావలయునో ఎఱుంగరాదు—అను
మానాస్పదము—"

"నాథా ! ఇంత జాగేల ? మననౌక రయంబున దరిజేరవలయు !—
నావికులను త్వరపెట్టుఁడు ! —"

"అసాధ్యము ! రమ్యను నౌక గమనము శీఘ్రతరము — మనము
పోఁబ్రయత్నించినను, ఆ పాత్ర మడ్డుతగిలి నిరోధించును — మఱియు,
ఐదారుగురు రమ్యనులు కన్పడునంతమాత్రమున పలాయన మొనరింపఁ
దలచుట పాడియగునా ? ధీరజన సమ్మతమా ? సుందరీ ! భయరహి
తవై సుఖోపవిష్టవుగమ్ము. అబల ఒక్కతె యున్నఁజాలు, నా కుడి
భుజము బలము సెడినటులగును."

భారతరమ్యాగయనైరి, ఇస్మాయిల్లా తమ తావునకుఁ బోయెను. భార్యా భర్తలట్లు పరస్పరము సంభాషించు నవసరమున, ఖలీలుఁడు సందు జూచి, ధైర్యాంచిత ప్రణయ వీక్షణము జులేఖాపైఁ బఱపెను. అదే సమయమని ఎంచి, జూలియను లూకాసులు తమ మనోహారిణులగు తైరజాగుల్నేరులను రయంబునడాసి వారిశ్రవణమున రెండుమాటలాడిరి

సహజముగ ధైర్యశాలియు మానియు నగు దల్తబసుపాషా తన నౌకను శీఘ్రతరముగ బోనీయఁడాయెను. రష్యను నౌక మఱియు మఱియు సమీపించుచుండెను. మేధావియగు ఖాలీలుఁ డాకస్మికముగ నిటులనెను. "పాషా! వారి యభిప్రాయమేమైనను మన మిచట నిలిచి యుందము."

అట్టి ప్రవర్తనమే సమంజసమని భావించి తన బానిసల నాజ్ఞాపింప, వారు తోడనే నౌకాదండములు వదలివైచిరి. అంతలో రష్యనునౌక దగ్గఱ కరుదెంచి ఎదురుగా నిలిచెను. సేనానియగు ఐవనుఁడు తురుష్క కాంతల నుద్దేశించి, ప్రణామపూర్వకముగా సవినయముగ శిరఃకంప మొనరించెను. తమ సహజ వినయ సౌశీల్య మచ్చుపడ నా నారీమణు లల్లన మోములు వాల్చిరి. తత్ప్రణామమునకుఁ దానె గుఱియైతినని భ్రమించిన దల్తబసుపాషా సైనికజనోచితముగఁ దన దక్షిణహస్తము నిజాననమున నెత్తెను. రష్యను నాయకుఁ డంత వారందఱను గలయఁ జూచి కడు సౌమ్యముగనే ఇట్లు విస్పష్టముగఁ బ్రశ్నించెను— "రష్యను భాష తెలియువారు ఇందెవ్వరైన నుందురా?"

తద్భాషాపరిచయము లేనికారణమున వారెల్లరు మౌనముద్రాభిముద్రితులై యుండ రష్యను సేనాని ఫ్రెంచిభాషయందు బ్రశ్నించెను.

ఖలీలుఁడు తోడనే దల్తబసుపాషావంక దిలకించెను. ఆ మహానీయుఁడు శూన్యవదనుఁడై వింత తెఱంగున శిరం బాడించి, గడ్డము దడవుచు నిట్లు గొణఁగెను — "ఈ సేనాని వట్టి దౌర్భాగ్యుఁడు

గావలయు — వట్టి మృగప్రాయుఁడు! [illegible] నేసి, పూజ్యులగు మహమ్మదు వారు నిర్వచించిన పవిత్రస్వర్గభాష వీనికి రాకుండునా?"

అట్టి వెంగిలిమాటలు లెక్క సేయక, ఖలీలుఁ డిట్టు లనెను :—
"ఆర్యా! నేను ఫ్రెంచిభాషయందుఁ బ్రత్యుత్తర మీయఁగలను."

ఆ భాష తమకు దెలియదని తైరజా గుల్నేరులతో జులేఖా యనెను. తనపలుకులకు బదులాడిన ఖలీలునిఁ గాంచి ఐనసుఁ డిట్లు పలికెను :—

"ఆర్యా! ఆ రష్యాను నావను శాసించు నాయకుఁడ నని ఎఱింగింపనిండు. ఇట్టులే మీ రెవ్వరో సగౌరవముగా నాకెఱుకపఱుతురా!"

"ఈ మేటిపురుషుఁడు దర్తబను పాషా యని యెఱుంగుము. ఈ నౌక ఈ మహనీయునిది. ఈ వనితామణులు పాషా కుటుంబము లోని వారు. నేనును ఈ గ్రీకుయువకు లిర్వురును పాషా యొక్క మిత్రులము, అతిథులము."

తురుష్కనారీమణుల వదనసౌందర్యము గాంచి ఆనందింపవలయు నని రష్యను సేనాని హృదయము తత్తరపడుచుండెను. కాని, దట్టంపు ముసుఁగుల నడంగియుండిన ఆ సుందరవదనబింబము లించుకేనియు గానరాకుండుటచే నైవనుఁడు కడు జీకాకు జెందియు గొంత నిగ్రహించుకొని ఖలీలు నుద్దేశించి ఇట్లు ప్రశ్నింపఁ బోయెను. —

"ఆర్యా! ఎఱుంగుదు గదా! మన దేశములు రెండును యుద్ధము విరమించి —"

"నీవా శ్వేతకేతనము ప్రదర్శించియే యుంటివి. కానియుద్ధమునఁ బట్టువడిన తురుష్కసైనికులను మా యధికారులు కప్పగించుటకొఱకే ఈ నావ యరుదెంచి యుండునా?"

"నీ యూహ సమంజసము, నిక్కము. కాని మనము వైరముడిగి యుంటిమి గదా. పరస్పరసుహృద్భావము వృద్ధియగుటకవకాశ మవశ్యము వాంఛనీయము గదా. కావున, పాషా సకుటుంబముగ మిత్రసహితముగ

మా నావమీఁదకరుదెంచి కించిత్కాలహరణ మొనరింపవలయునని యర్థించువాఁడను — మర్యాదల కణుమాత్రమైనను లోటుండదు."

"ఆర్యా! నీయాహ్వాన మానందప్రదము. కాని, ఈవిషయమున పాషా యభిమతము నాకుఁ దెలియును. కాన, నాతనిఁ బ్రత్యేకముగఁ బ్రశ్నింపకయే ఉత్తర మొసంగఁగలను. పాషా రయంబునఁ దన గృహము జేరవలయును. కావున, నీయాతిథ్యభాగ్య మనుభవించు నదృష్టము మాకు లేదని విన్నవించువాఁడను."

అట్లు లాశాభంగ మగుచు, రష్యనుసేనాని పెదవి గఱచికొనెను. వాని వదనమున నొకానొక వికారభావము మెఱపువలెఁ దోఁచి, అట్టులే యదృశ్యమాయెను. సూక్ష్మగ్రాహియగు ఖలీలుఁ డద్దానిం గనిపెట్టెను. సేనాని ప్రయత్నము మొదటినుండియు గుటిలముగనే యుండెనని ఖలీలుఁడు గుర్తించుచుండెను. వాని వినయగౌరవములు వట్టి బూటకములని అతఁడు సుళువుగా గ్రహించెను. తన నౌక పాషానౌకను జేరినంతనే, ఆ సేనాని ఏకతీక్ష్ణవీక్షణమాత్రమున దురుష్క నావికులను బరిశీలించి, వారాయుధ రహితులని దెలిసికొనెను. రష్యను నావికు లాయుధహస్తులై యుండిరి. తాను దత్తబను పాషాను పరిచయ మొనరించు సమయమున నారష్యను సేనాని నావ వంక దిలకించి చీకాకుపడుటయు గూడ ఖాలీలుఁ డరసియుండెను. కావునఁ దా నట్లు ప్రత్యుత్తర మొసంగినంతనే యవనుఁడు దురంత వికారవదనమునఁ బెదవి గఱచుటచే దురుష్క యువకుని యను మానము దృఢతరమాయెను. యవనుఁ డొక్క నిమిష మూరకుండి మగుడ నిట్టులనెను :

"ఆర్యా! నీవి తెఱంగున నా నిరాకరించుట యసభ్యము. నా యందు దయయుంచి మదీయాహ్వానము పాషాకు నివేదింపుము."

తానట్టులే యొనరింతునని ఖలీలుఁడు సగౌరవముగఁ బలికి పాషా

వంక మోము ద్రిప్పెను. ఖలీలుని యపూర్వగంభీరోదారప్రవర్తనమును నిరుపమానతేజోవిరాజమాన మనోహరమూర్తియు గాంచినంతనే ధూర్తుఁడగు ఐవనుఁడు తన యంతరము బాధాకరముగ గ్రహించి మగుడ బెదవి గఱచికొనెను.

ఐవను ఖలీలుల ప్రసంగము నాలించిన జులేఖా తక్కుంగల కాంతలకు వారి దేశభాషయందుఁ దెలిసెఁబఱచెను. రష్యను సేనాని యాహ్వానమును ఖలీలుఁ డేల నిరాకరించెనో అరయఁజాలక వారు విస్మయాక్రాంతచిత్తలైరి. నిజమనోహరుని అద్భుతప్రవర్తన మెఱింగిన జులేఖా అట్టి నిరాకరణమున కేద్దియో కారణ ముండునని విశ్వసించి నిశ్చలహృదయురాలై యుండెను. అపూర్వమేధావంతుఁడగు ఖలీలునిపై దత్తబను పాషా అమిత విశ్వాస ముంచుటయే గాక, ఆ విపరీతాంగుళీయోదంతము నిరంతరము కంటికిఁ గట్టి నటులుండుటచేఁ గూడ నాతఁడు ఖలీలుని యభిప్రాయము నామోదించెను. కాన నాయువకుఁడు ఐవనుని గాంచి ఇట్లు పలికెను:

"ఆర్యా! పాషా భవదీయాహ్వానమునకుఁ గడు సంతసించి కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించితి ననియు, రాఁజాలమని వగచువాఁడ ననియు, జెప్పెను."

ఐవనుఁడు తోడనే దురంతక్రోధఘూర్ణమాన మానసుఁడై, రోషభీషణవదనుఁడై దుర్భరంబగు విసువునఁ జేయి విదలించి తీవ్రస్వరంబున నిట్లు లనెను. — "ఇట్టి మూర్ఖప్రవర్తన మెన్నఁడు గాంచి యెఱుంగను! నేను సుహృద్భావమున నాహ్వానించుటయుఁ మొఱకు దనంబున నిరాకరించుటయునా?"

ఖలీలుఁడు తత్సమయానుకూలముగ గంభీరముగ నిట్లు బదులాడెను. — నీ వట్లు లనరాదు నీ యాహ్వానము సగౌరవముగ నున్నచో మేము తదనుగుణముగనే మెలంగితిమి. అంతకంటె నధిక

మొనరింపఁజాలము. మఱియు మా దేశసాంప్రదాయము ననుసరించి ఆహ్వానముల నామోదింతుము; ఇష్టము లేకున్నను, కష్టముగ నున్నను నిరాకరింతుము — ఇయ్యది మా యాచారము."

"మీ తురుష్కుల నడవడి కేవల మనాగరికము. చూడు మా కాంతలు నల్లని చిక్కని ముసుంగులు దాల్చి మోములను బూర్తిగ మఱుగు పఱచి కేవల జీవరహితశిలాప్రతిమలవలె నెటులున్నవారో!"

ఘూర్జుఁడగు ఐవనుఁడటులు పలుక, ఖలీలుఁ డిట్టులనెను — "చాలు నీప్రల్లదనము! పాషా! ఇఁక మననౌక పోనీయ నాజ్ఞాపింపుము."

దల్తబను పాషా తోడనే ఆజ్ఞాపూర్వకముగ సన్నయొనరింప, నావికులు వడివడి దండంబులు త్రిప్పఁదొడంగిరి. తురుష్కనౌక యట్లు కదలినంతనే, దుర్మదాంధుఁ డగు రమ్యాను సేనాని సహజముగ పాద తాడిత పన్నగము పగిది క్రోధాతిరేకమున రోఁజుచు దుర్భరావ మానమునై పఁజాలక తీవ్రాస్పష్ట మందస్వరమున నిట్టులనుకొనెను — "ఇంతటి యవమానమునకుఁ బాల్పడితిమి, సహించి యూరకుందునా? తురుష్క నౌకాదళమంతయు నే తెంచుగాక! — ఆ నారీమణులంబట్టి నానావపైఁ జేర్చెదను."

తురుష్కనౌక ఇంతలోఁ గొంతదూరము బోయెను. రమ్యాను సేనాని యభిప్రాయము తెల్లమాయెను. వాని తుది పలుకులు తెలియకున్నను, వాఁడు దుష్టాలోచనాయుత్తచిత్తుఁడై యున్నాఁడని స్పష్టమాయెను. తాను ఐవనునితో సలిపిన ప్రసంగమును ఖలీలుఁడు పాషాకు శీఘ్రముగఁ దెలియఁబఱచెను. అతఁడు వీరపురుషోచితముగ యుద్ధసన్నద్ధుఁడాయెను. ఖలీలుఁడు సంతసించి భయకంపితలగు స్త్రీజనంబులకు ధైర్యము గఱపెను. రమ్యాను నౌక శీఘ్రతరగామి యగుటచే, దురుష్క నౌక పలాయనమొనరింపఁగోరినను అసాధ్యము. కావున, పాషా అట్టి ప్రయత్న మొనరింపలేదు. కాంతలకుఁ గాఁపుగా నావికు

లను నియోగింపవలయు ననియు, తాను గ్రీకు యువకులతోఁబాటు నప్రమత్తతతో నౌకాముఖమున నిలిచియుండుననియు ఖలీలుఁడు పలికెను. ఇతరవ్యాపారములందు మందబుద్ధియైనను యుద్ధవిషయములందుఁ గడు శ్రద్ధాళుఁడగు పాషా అందులకు సమ్మతించుటయేగాక రెండు అరిత్రంబులు విఱిచి తెద్దండములు చాల్చియుండవలయునని తన బానిసల నాజ్ఞాపించెను. అనంతరమూపీసుఁడు అబలలకు ధైర్యము గఱపెను. ఇస్మిల్డా ఒక్కతెయె భయకంపితయై అట్టిహెచ్చరిక నాకాంక్షించియుండెను. జులేఖా తైరజాగుల్నేరులు తమ ప్రియులు ధైర్యస్థైర్య సమన్వితులని యెఱిఁగి నిబ్బరముగ నుండిరి. ఖలీలుఁ డంతలో నిజమిత్రసహితముగ నౌకాముఖంబునకుఁ బోయి శత్రునౌకను వీక్షింపదొడంగెను.

## ౨౭

### పోరాటము

తురుష్కనౌకాసంరక్షణార్థ మట్టిప్రయత్నము లన్నియు నాలుగైదు నిముసములలో నాయెను. ఐవనుఁ డాసన్నాహములు సూక్ష్మముగా గ్రహించుచుండెను. ఒక్కక్షణమాత్ర మాతఁడు పశ్చాత్తాపమందెను. తన ధూర్తప్రవర్తన మాతని కిపుడు తెల్లమాయెను. పోరాటము తప్పదు. ఈ పోరాట మెట్లుపరిణమించునో యెఱుంగరాదు. ఐనను ఇంత యొనరించి వెనుదిరుగుట యసంభవము. మఱియుఁ దానాతురుష్క కాంతలను యుద్ధనావమీఁదకు రప్పింతుసని ముందాతఁడు తన ప్రధానోపనాయకునితో బీరములాడి యుండెను. ఖలీలునితో నట్టు లధిక దర్పములాడిన ఐవనుఁ డెట్లుపోగలఁడు? మఱియుఁ దన యనుచరులు చులకన చేయుదురను భయముగూడఁ దోడగుటచేఁ బౌరుషవంతుఁడగు నైవనుఁడు పోరాటమున కాయత్తమాయెను.

తురుష్కుల సన్నాహములం జక్కఁగఁ బరిశీలించి తానుచిత ప్రయత్న మొనరించుటకై ఐవనుఁడు తన నౌకను గొంతదవ్వునకుఁ బోనిచ్చెను. మనస్సందు ఆయుధహస్తులను దాఁగనలయునా, లేక, దండధరులగు భటులపైఁ బడవలయునా, యని కొంత తడ వాతఁడు చింతించెను. సాహసవంతుఁడగు రష్యను సేనాని వీరులగు తురుష్క యువకులను దాఁకుటయే పౌరుషవంతమనియు, వారిం బట్టిన యనంతరము పాషా తక్కుంగలవారలు సులువుగా వశులగుదురనియు నెంచి అట్టులొనరింప నిశ్చయించెను.

తన యనుచరులకు వలయు నుపదేశము లొసంగి ఐవనుఁడు స్వయముగాఁ జుక్కానిబట్టెను. నావికు లరిత్రములు దాల్చిరి. నౌక తురుష్క ప్రాంతమును డాసినంతనే సేనాని చుక్కాని వీడి ఖడ్గము ధరించెను. నావికులుగూడ దండంబులు బోఁద్రోసి కత్తులఁ బూనిరి. ఇరువురు దృఢగాత్రులు వెంట సరుదేఱ, ఐవనుఁడు చంగున ముందుకుఁ బోయి, ఫ్రెంచిభాషయందు బిగ్గరగ "ముప్పూరకు ముప్పూరము!" అనిపలికెను.

పోరాటము ప్రారంభమాయెను. ఐవనుఁడు సగర్వముగ నౌక యుక్కుజీను(లంగరు)పాషానౌకపై విసరెను. వీరుఁడగు ఖలీలుఁడు త్రిప్పు ఖడ్గము నాతఁడు నేర్పుమెయి తప్పించుకొనెను. అనంతర మా యోధు లిర్వురు ద్వంద్వ యుద్ధమునకుఁ దలపడిరి. జూలియును లూకాసులు సాయుధులగురష్యనుభటులను దాఁకిరి. ఖడ్గములు మెఱుపులవలెదీపించి కణకణరవంబు లొనరించినంతనే భీతచిత్తయగు నిస్మిల్డామందస్వరంబుననే 'హా' యని విలపించెను.

తోడనే పాషా తీవ్రముగ మందలించెను.

అనంతర మామహనీయుఁడు యుద్ధరంగము సమీపించి శత్రు సంఖ్య యధికతరంబగుసేని తన మిత్రులకుఁ దోడ్పడవలయునని నిశ్చయించి అప్రమత్తుఁడై యుండెను. అట్టి యవసరము నిక్కముగ

వెంటనే యురుదెంచెను. తురుష్క ఖడ్గ ప్రహారమున నైవనుని వామ భుజము తెగి రక్తము స్రవింపఁజొచ్చెను. రుధిరము గాన్పించినంతనే మిగిలిన సైనికులు నల్వురును సహింపఁజాలక, ఆగ్రహావేశమునఁ గృపాణములుదూసి ముందునకుఱికిరి. ఖలీలుఁడు వారి ప్రయత్నము గుర్తించి తటాలున రష్యనునొకనిపై లంఘించి ఒక్కవ్రేటున ఐవనుని దక్షిణ భుజముగూడ ఛేదించెను. ఆ వీరుఁడు తోడనే డిల్లపడిసోలుచు వెనుకంజవైచియు, మగుడ స్థైర్యగుణ ధుర్యుఁడై, సమరకార్య పరతంత్రుఁ డాయెను. తమమిత్రుఁడగు ఖలీలునితోఁబాటు జూలియసు లూకాసులుగూడ రయమ్మునఁ దమనొకవీఁడిరి. ఆ వెంట పాషా చయ్యనఁబోయెను.

పోరాటమొక్కక్షణములోఁ గడు దారుణమై, ఐదాఱు నిముసములు దుర్నిరీక్షముగఁ జెలరేగి చల్లారెను. ప్రతాపశాలియగు ఖలీలున కోహటించి ఐవనుఁడు నిరాయుధుఁడై భూపతనుఁ డాయెను. జూలియను లూకాసుల భుజబలమున నిర్వురు రష్యనుభటులు తెగటారిరి. దల్తబను పాషా డాఁకిన సైనికుఁ డపాయకరమగు గాయము దిని నేల గూలెను. పాషా భటులుకూడ రంగమున రయంబున బత్యక్షమైరి. మిగిలిన వైరిభటులు ముప్వురు సులభముగా నాయుధరహితులై వశులైరి. తురుష్క వీరులకుదగిలిన గాయములు కడుస్వల్పములు. తురుష్కులీ విధంబున సంపూర్ణ విజయము గాంచిరి.

ధూర్తుఁడగు రష్యనువీరుఁడు శవసెడి ధరాతలంబున వ్రాలినంతనే వాని పేరుటురమున ఖలీలుఁడు తనే పాదము మోపి పోరాటము ముగిసినంతనే చరణముదీసి లెమ్మని ఆజ్ఞాపించెను. రక్తసిక్తుఁడగు నైవనున కట్టికార్యము కష్టసాధ్య మగుటచే నాతఁడు మెల్లగ నిలుచుండెను. వాని వదనమునఁ దాండవించు దుర్భరాగ్రహావమానములు వర్ణనాతీతములు. ఆదుర్బలుని చిత్తము దురంతమగు పౌరుష

ముతో నుడికిపోవుచుండెను. అపారదుర్గర్వమున నగుదెంచిన ఆనాయ కునకట్లు శృంగ భంగమగుటచే మాటాడక, క్రూరమృగోచితఘాతుక వీక్షణంబుల దురుష్క వీరులఁగలయఁ జూచెను.

సహజోదార హృదయుఁడగు ఖలీలుఁడు తన యధీనుఁడైన వైరి వీరుని గాయము తోలుదో ల్తగట్టి, రక్తస్రావము మాన్పి, అనంతర మిట్టులనెను — సైన్యాధిపా! నిష్కారణముగ మమ్ముఁదాఁకి ఇంతటి యాగడ మొనరించితివి. మానాయకుఁడగు దల్తబనుతరపునఁ బ్రశ్నిం చువాఁడ — నీవొసంగు సమాధానమెద్ది ? ”

సమయము విషమముగఁ బరిణమించినను, రష్యాను సేనాని దుర హంకారమడంగ దాయెను. తా నేసమాధాన మొసంగననియు, నీతిబాహ్యులగు తురుష్కుల దయనర్థించువాఁడఁగాననియు నాతఁడు విస్పష్టముగ వక్కాణించెను. ఖలీలుఁ డంత నిట్టులనెను. —

“ ఇట్టి దుర్గర్వము నిరర్థకము. నీప్రవర్తనము సర్వవిధముల నిం ద్యము గదా. యుద్ధవిరామ సమయమయ్యు, నిర్హేతుకముగ మమ్ము దాఁకి శాంతి భంగపఱచితివి: నిక్కంపుఁ బౌరుష మెఱుంగని పంద పగిది నధర్మయుద్ధమునకుఁ దలపడి అబలాజనంబులకు భయ భ్రాంతులు గల్పించితివి — ”

“ నే నట్టి దౌష్ట్యము లొనరించిననేమి ? తత్ఫల మనుభవించుటకు సంసిద్ధుఁడను ; — మూర్ఖాగ్రేసరుఁడగు మీపాషాను క్షమాభిక్ష నర్థింతునని మాత్రము తలంపకుము. ఒక్కవిషయము మాత్రము గమనించి మెలంగుము. యుక్తాయుక్తము లరయక నన్ను శిక్షింపఁ గడంగుదేని, ఆయుద్ధనాపపై నుండు నాయుద్యోగులు తగు ప్రతి క్రియ సల్పుదురు. మాయధీనమున నఱువండ్రు తురుష్కయోధు లున్నవారు — ”

ఖలీలుఁడు క్రోధారుణితనేత్రుఁడై ఐవనుని వారించి ఇట్టులనెను,

వారిని మా రాజధానియం దప్పగింపవలయు! యుద్ధమునఁ బట్టువడిన మీ యోధుల నీసరికి మా నావ మీ నగరము జేర్చియుండును."

"మాటలకేమి? కార్యమెట్లు పరిణమించునో చూడుము. అల్లవె! చూడుము. మా నావనుండి నాలుగేడు దూరదర్శన యంత్రములు! మన పోరాటముఁ గాంచి నాకు సాహాయ్య మొనరింపఁ మఱియొక నౌకను యుద్యోగులు లాయత్తము చేయువారు! ఇపుడు జయించితినని గర్వింపకుము! మఱియు నా యధీనమున నున్న మీ వారలెట్టి యవస్థకుఁ జొల్పడుదురో గ్రహించి మెలంగుము."

ఐవనుని పలుకు లసత్యములు గావు. పంద్రెండు నండములు గల పెద్ద నౌక యొకటి సైనికజన సంకీర్ణమై యరుదెంచుచుండెను. యుద్ధనావయందలి ఫిరంగులు గూడ భయంకరముగ గోచరించుచుండెను. పరిస్థితు లట్లు కడు విషమముగ నున్నను జలింపక, రష్యను సేనానితోడి ప్రసంగము ఖలీలుఁడు పాషాకుఁ దురుష్కభాషయందుఁ దెలియఁబఱచెను. మహమ్మదీయ ప్రభువు తోడనే క్రోధవివశుఁడై, తత్క్షణ మా రష్యనుని బొలియింపఁ గోరెను. దానగలుగు నుపద్రవము — రష్యనుల యధీనమందున్న తురుష్కయోధులకు సంభవింపఁగల అపాయమును విశదీకరించి, ఐవనుని సాహాయ్యమున కరుదెంచు రెండవ నౌకను జూపి, రష్యను యుద్ధనావయందలి ఫిరంగులను ఖలీలుఁడు స్మరణకు దెచ్చినంతనే దత్తబసు పాషా ఆగ్రహముడిగి కర్తవ్యము నిర్ణయింపనేరక కార్యభారము పూర్తిగ ఖలీలుని మీఁదనే యుంచెను. జూలియను లూకాను లందులకు సంతసించిరి.

రెండవ రష్యను నౌక క్రమముగా దగ్గఱయగుచుండెను. ఖలీలుఁడు రయమున నైవనుని వంకఁ దిరిగి నిశ్చల గంభీరస్వరంబున నిట్టులనెను:—

"దత్తబసు పాషా యభిమత మాలింపుము. మా తురుష్కయోధులను ముందుగ దిగ విడిచినచో, నిన్నుఁ బోనిత్తుము."

"అందుల కొడంబడనిచో నేమి సేయుదురు?"

"నీశిరము తెగి నేలఁబడును. అనంతరము మాభుజబలము గొలఁది ఆ రెండవ నౌకతోఁ బోరాడుదుము. నీవొక్క విషయము గమనింపవలెను: తొంటి మాకార్యమునకు లార్యులు ఆయుధరహితులు గారు. వారిపుడు మాఖడ్గములు దాల్చి యుద్ధసన్నద్ధులై యున్నవారు."

"ఆర్యా! అంతమాత్రమున భయంకంపితుఁడ గానని యెఱుంగుము. మఱుఁడఁ బోరాటము కలుగునేని, నీవు జయింపగలవా? అసంభవము! అసంబద్ధము! ఆనౌకయందనేకులున్నవారు: వారందఱు ఖడ్గధరులగుటయే గాక తుపాకులుగూడ దాల్చిరి —"

"ఎందులకీ మిథ్యాసంకల్పములు! కాలహరణ మొనరింపక సత్వరము ప్రత్యుత్తర మొసఁగుము. లేదేని, మరణింప సిద్ధముగనుండుము!"

ఐవనుని సురహంకారము చాలవఱ కంతరించెను. తానట్లు కలహమునకుఁ గాలు ద్రువ్విన సమాచారము పాషా మఱువవలయుననియు, రష్యను ప్రభుత్వమునకు కాయుదంతము తెలియరాదనియు నాతఁడు కోరెను. ఖలీలుఁడు సమ్మతించి వెండియు నిట్లుపలికెను:

"నేఁ జెప్పిన చొప్పున మాతురుష్కయోధులు సురక్షితముగ దిగువఱకు నీవిచటనే యుండవలయు—నన్ను వారింపఁగడంగక పూర్తిగ నాలింపుము. ఐదు నిముసములలో నానవాశయనౌక మన చెంత కరుదెంచును. నీవీలోన నేఁగోరినట్టు లొనరింతునని సమయ మొనరింపవేని, నీశిరం బొక్కవ్రేటునఁ దెగిపడును— ఆనౌక యరుదెంచునంతనే నేసందుఁ బ్రవేశింతును. మావార లందఱు సురక్షితముగ స్వదేశ తిరస్థులగుట నేను గనుఁగొనఁ జూడవలయు. అనంతరము నేనిచట కరుదెంచునంతనే నీవానౌక నారోహించి వెడలవచ్చును. సైన్యాధిపా! అంగీకరింతువా! ఆనౌక సమీపించుచున్నది— త్వరపడుము!"

